# అథ ద్విచత్వారింశో%ధ్యాయః

## చక్రవాక పక్షులు ఉత్తమగతిని పొందుట

భీష్మ ఉవాచ |

మార్కండేయ మహాప్రాజ్ఞ పితృభక్తిభృతాం వర | కిం జాతం తు తతో బ్రూహి కృపయా మునిసత్తమ || 1

భీష్ముడు ఇట్లు పలికెను -

ఓ మార్కండేయా ! నీవు మహా ప్రజ్ఞాశాలివి. నీవు పితృభక్తి పరాయణులలో శ్రేష్ఠుడవు. ఓ మహర్షీ ! తరువాత ఏమి జరిగినది ? దయచేసి చెప్పుము (1).

మార్కండేయ ఉవాచ |

తే ధర్మయోగనిరతాస్సప్త మానసచారిణః | వాయ్వంబుభక్షాస్సతతం శరీరముపశోషయన్ || 2

స రాజాంతఃపురవృతో నందనే మఘవా ఇవ | క్రీడిత్వా సుచిరం తత్ర సభార్యస్స్వపురం య¸° || 3

అనూహో నామ తస్యాసీత్పుత్రః పరమధార్మికః | తం వైభ్రాజస్సుతం రాజ్యే స్థాపయిత్వా వనం య¸° || 4

తపఃకర్తుం సమారేభే యత్ర తే సహచారిణః | సవై తత్ర నిరాహారో వాయుభక్షో మహాతపాః || 5

తతో విభ్రాజితం తేన విభ్రాజం నామ తద్వనమ్ | బభూవ సుప్రసిద్ధం హి యోగసిద్ధప్రదాయకమ్ || 6

తత్రైవ తే హి శకునాశ్చత్వారో యోగధర్మిణః | యోగభ్రష్టాస్త్ర యశ్చైవ దేహత్యాగకృతో%భవన్ || 7

కాంపిల్యే నగరే తే తు బ్రహ్మదత్తపురోగమాః | జాతాస్సప్త మహాత్మానస్సర్వే విగతకల్మషాః || 8

స్మృతిమంతో%త్ర చత్వారస్త్రయస్తు పరిమోహితాః | స్వతంత్రస్యాహ్వయో జాతో బ్రహ్మదత్తో మహౌజసః || 9

ఛిద్రదర్శి సునేత్రస్తు వేదవేదాంగ పారగౌ | జాతౌ శ్రోత్రియదాయాదౌ పూర్వజాతి సహోషితౌ || 10

పంచాలో బహ్వృచ స్త్వాసీదాచార్యత్వం చకార హ | ద్వివేదః పుండరీకశ్చ ఛందోగో%ధ్వర్యు రేవ చ || 11

తతో రాజా సుతం దృష్ట్వా బ్రహ్మదత్తమకల్మషమ్ | అభిషిచ్య స్వరాజ్యే తు పరాం గతిమవాప్తవాన్ || 12

మార్కండేయుడు ఇట్లు పలికెను -

యోగధర్మమునందు నిమగ్నులై మానససరోవరములో సంచరించే ఆ ఏడు చక్రవాకములు వాయువును, నీటిని మాత్రమే ఆహారముగా తీసుకుంటూ సర్వకాలములలో శరీరమును శుష్కింపజేసినవి (2). అంతఃపుర పరివారముతో గూడి వచ్చిన ఆ రాజు నందనవనములో ఇంద్రునివలె ఆ అడవిలో చాల కాలము రమించి భార్యతో గూడి తన నగరమునకు వెళ్లెను (3). ఆ వైభ్రాజ మహారాజునకు పరమధర్మాత్ముడగు అనూహుడనే పుత్రుడు ఉండెను. ఆయన పుత్రుని రాజుగా అభిషేకించి అడవికి వెళ్లెను (4). ఆ ఏడు పక్షులు కలిసి జీవించుచున్న స్థానములో ఆ మహారాజు ఆహారమును విడిచిపెట్టి గాలిని మాత్రమే ఆహారముగా తీసుకుంటూ గొప్ప తపస్సును చేయుటనారంభించెను (5).విభ్రాజమనే ఆ అడవి ఆ మహారాజుచే ప్రకాశింప చేయబడెను. ఆ అడవి యోగసిద్ధులనిచ్చునని పెద్ద ప్రసిద్ధి కలిగెను.(6). యోగధర్మమునందు నిష్ఠగల నాల్గు పక్షులు మరియు యోగమునుండి జారిపోయిన మూడు పక్షులు అచటనే ప్రాణములను విడిచెను (7).

తొలగిన మాలిన్యము గల ఆ ఏడు పక్షులు కాంపిల్యనగరములో బ్రహ్మదత్తుడు మొదలగు పేర్లు గల ఏడు మహాత్ములుగా జన్మించినవి (8). వారిలో నలుగురుకి పూర్వజన్మజ్ఞానము ఉండగా, ముగ్గురు పూర్తిగా విస్మరించిరి. స్వతంత్రుడను పేరు గల పక్షి గొప్ప తేజశ్శాలియగు బ్రహ్మదత్తుడై జన్మించెను. (9). ఛిద్రదర్శి, సునేత్రుడు అనే పక్షులు శ్రోత్రియుని కుమారులై జన్మించి వేదవేదాంగములలో నిష్ణాతులైరి. వారికి పూర్వజన్మ స్మృతి ఉండెను (10). ఒక పక్షి పంచాలుడను పేరుతో జన్మించి ఋగ్వేదమును పఠించెను. పంచాలుడు ఆచార్యుడాయెను. మరియొక పక్షి పుండరీకుడై సామవేదము, యజుర్వేదము అను రెండు వేదములనధ్యయనము చేసెను (11). ఆ దేశము యొక్క మహారాజు పరమపవిత్రుడగు బ్రహ్మదత్తుడనే తన పుత్రుని రాజ్యమునందు అభిషేకించి ఉత్తమగతిని పొందెను (12).

పంచాలః పుండరీకస్తు పుత్రౌ సంస్థాప్య మందిరే | వివిశతుర్వనం తత్ర గతౌ పరమికాం గతిమ్ || 13

బ్రహ్మదత్తస్య భార్యా తు సన్నతిర్నామ భారత | సా త్వేక భావసంయుక్తారేమే భర్త్రా సహైవ తు || 14

శేషాస్తు చక్రవాకావై కాంపిల్యే సహచారిణః | జాతాః శ్రోత్రియదాయాదా దరిద్రస్య కులే నృప || 15

ధృతిమాన్ సుమహాత్మా చ తత్త్వదర్శీ నిరుత్సుకః | వేదాధ్యయనసంపన్నాశ్చత్వారశ్ఛిద్రదర్శినః || 16

తే యోగనిరతాస్సిద్ధాః ప్రస్థితాస్సర్వ ఏవ హి | ఆమంత్ర్య చ మిథశ్శంభోః పదాంభోజం ప్రణమ్య తు || 17

శూరా యే సంప్రపద్యంతే అపునర్భవ కాంక్షిణః | పాపం ప్రణాశయంత్వద్య తచ్ఛంభోః పరమం పదమ్ || 18

శారీరే మానసే చైవ పాపే వాగ్జే మహామునే | కృతే సమ్యగిదం భక్త్యా పఠేచ్ఛ్రద్ధా సమన్వితః || 19

ముచ్యతే సర్వపాపేభ్య శ్శివనామాను కీర్తనాత్ | ఉచ్చార్యమాణ ఏతస్మిన్ దేవదేవస్య తస్య వై || 20

విలయం పాపమాయాతి హ్యామభాండమివాంభసి | తస్మాత్తత్సంచితే పాపే సమనంతరమేవ చ || 21

జప్తవ్యమేతత్పాపస్య ప్రశమాయ మహామునే | నరైః శ్రద్ధాలుభిర్భూయస్సర్వకామఫలాప్తయే || 22

పుష్ట్యర్థమిమమధ్యాయం పఠేదేనం శృణోతి వా | ముచ్యతే సర్వపాపేభ్యో మోక్షం యాతి న సంశయః || 23

ఇతి శ్రీ శివ మహాపురాణ    ఉమాసంహితాయాం చక్రవాకానాం ఉత్తమగతి వర్ణనం నామ ద్విచత్వారింశో%ధ్యాయః (42).

పంచాలుడు, పుండరీకుడు తమ పుత్రులను దేవాలయమునందు స్థాపించి అడవికి వెళ్లి అచట ఉత్తమ గతిని పొందిరి (13). ఓ భరతవంశీయుడా ! బ్రహ్మదత్తుని భార్య పేరు సన్నితి. ఆమె గొప్ప పతివ్రత. ఆమె భర్తతో గూడి విహరించెను (14). ఓ మహారాజా ! మిగిలిన చక్రవాక పక్షులు కాంపిల్య నగరములో దరిద్రుడగు శ్రోత్రియునకు పుత్రులై జన్మించి కలిసి జీవించిరి (15). ఛిద్రదర్శియే ఆ శ్రోత్రియుడు అయెను. ధృతిమంతుడు, సుమహాత్ముడు, తత్త్వదర్శి మరియు నిరుత్సుకుడు అనే పేరు గల ఆ నల్గురు పుత్రులు వేదాధ్యయనములో నిష్ణాతులైరి (16). యోగములో నిష్ణాతులు, మరియు సిద్ధులు అగు ఆ నల్గురు ఒకరినొకరు సంప్రదించుకొని, శంభుని పాదపద్మములకు ప్రణమిల్లి బయలుదేరిరి (17). పునర్జన్మ లేని మోక్షమును గోరు ధీరులు శివుని పాదములను పట్టుకొనెదరు. శంభుని అట్టి పరమపదము ఈనాడు మన పాపములను పోగొట్టుగాక! (18). ఓ మహర్షీ !శరీరముతో గాని,

వాక్కుతో గాని, మనస్సుతో గాని ఏదేని పాపమును చేసినచో, అట్టివాడు శ్రద్ధతో గూడినవాడై దీనిని భక్తితో చక్కగా పఠించవలెను (19). దేవదేవుడగు శివుని నామమును ఉచ్చరించుటచే వెంటనే సర్వపాపములనుండి విముక్తి కలుగును (20). శివనామోచ్చారణముచే నీటియందు పారవైచిన పచ్చికుండవలె పాపము వినష్టమగును. ఓ మహర్షీ ! కావున పాపమును మూటగట్టుకొని యున్న మానవుడు ఆ పాపము నశించుట కొరకై వెంటనే దీనిని జపించవలెను. మరియు శ్రద్ధావంతులగు మానవులు శివనామ జపముచే సర్వకామనలను మరియు ఫలములను పొందెదరు (21,22). ఈ అధ్యాయమును పఠించే, మరియు శ్రవణము చేసే మానవుడు పుష్టిని పొంది, సకల పాపములనుండి విముక్తుడై మోక్షమును పొందుననుటలో సందేహము లేదు (23).

శ్రీ శివమహాపురాణములోని ఉమాసంహితయందు చక్రవాక పక్షుల ఉత్తమగతిని వర్ణించే నలుబది రెండవ అధ్యాయము ముగిసినది (42).